కళాకేళీ ప్రచురణలు : **20**

# గోదావరిజలప్రళయం

అ ఖ ం డ  కా వ్య త రం గి ణి.





సోమసుందర్.

తొలిసారి : వేయిప్రతులు.
విజయ : భాద్రపదం.
1953 : అక్టోబర్.

అమ్మకానికని కాదు; విరాళానికే;
అయినా కనీస ధర
 అర్ధరూపాయి.





• కృతజ్ఞత •

ఈ గ్రంథపు ప్రతులను మీవద్దకు తెచ్చి
మీ ఉదార విరాళాలను సేకరిస్తూ
ఆంధ్రప్రభ వరదబాధితుల సహాయనిధికి
తోడ్పడుచున్న
తూర్పు గోదావరిజిల్లా యువజన సంఘానికి.



ప్రతులకు :
కార్యదర్శి : తూర్పు గోదావరిజిల్లా యువజన సంఘం,
అంగర.
కార్యదర్శి : కళాకేళీ ప్రచురణాలయం,
శామల్‌కోట.

గోదావరి పరదబాధితుల
కడగండ్లకు కరగి
అహోరాత్రాలు అన్నపానాలు మాని
అపూర్వ సేవచేస్తున్న
ఆదర్శ యువతి
కుమారి టి. పి. అంజనాదేవికి.

1-10-1953.



# సోమసుందర్ కృతులు :

## ముద్రితాలు

వజ్రాయుధం. (కావ్యసంపుటి)

పానిసలదేశం. (కథలసంపుటి)

మందీ—మనిషి. (గేయరూపకము)

రామ్ (బందుల) రాజ్యం. (నాటిక).

కాహళి. (గేయసంపుటి)

గోదావరిజలప్రళయం. (అఖండకావ్యం)

## అముద్రితాలు

రక్తాక్షి. (కావ్యసంపుటి)

ఆగ్నేయనేత్రం. (కావ్యసంపుటి)

సోమరసం—సుందరకాండ. (కావ్యసంపుటి)

జీర్ణపత్రాలు. (కథలసంపుటి)

వ్యాసాలు : ఉపన్యాసాలు.

కాలంజాడలు. (చిత్రికలు)

జీవితరేఖలు. (లేఖలు)

# గోదావరి జలప్రళయం

## పొంగు:

ఏమమ్మా ప్రళయమువలె పొంగిన ఓ గౌతమీ!
ఇకనైనా దయనుజూపి శాంతించవదేమీ?
ప్రసవించిన పులివై నీ కన్నబిడ్డలను నమ్ముల
కోరలెత్తి మ్రింగుట యిది ఏమి న్యాయమే తల్లీ?
ఏబది మూడేళ్ళక్రితం నీ తరగలు పగబట్టిన పడగలవలె
ఈ పుడమిని బ్రతుకులపై కాటువేసెనని విందును....
ఏల క్షుధాకలితమూర్తివై మళ్ళీచేసుకొంటి వీవిందును?
ఏమమ్మా! ప్రళయమువలె పొంగిన ఓ గౌతమీ!
ఇకనైనా దయవహించి శాంతించవదేమీ!

## విపత్తరంగం:

ఊళ్ళూ బీళ్ళూ పొలాలు మళ్ళూ మాన్యాల్ ధనాలు
కొల్లగొట్టినావు తల్లి ఎల్లెడల విపత్తుముంచి
ఇళ్ళూ ఫలాల్ వనాలు బళ్ళూ హలాలు సర్వము
మేడలు మిద్దెలు గాదులు రజితాదుల బొక్కసాలు
పాకలు పూరిళ్ళు పురులు వాకలు వాములు సొమ్ములు
లోగిళ్ళూ వాకిళ్ళూ రోళ్ళూ రోకళ్ళూ మూకుళ్ళూ
నోట్లూ బట్టలపెట్టెలు చెట్లూ గట్లూ సర్వము
ఏళ్ళూ పూళ్ళుగమారిచి కొల్లగొట్టినావుతల్లి!

అయ్యో! అయ్యయ్యో!! నాతల్లీ — ఓప్రళయకాల గోదావరి!
ఎంతో బ్రతుకు బ్రతికి నీవు వన్యనీతి కొడిగట్టితివేలనె నా తల్లీ!

కరువులతో, కలరాతో, మసూచితో, మరణంతో,
రణాలతో, వ్రణాలతో, విషక్రిముల తుఫాన్లతో,
అధికవృష్టి, అనావృష్టి — ముంపిడి, ఎద్దడులతో,
కాటకాల, కటకటాల, భయానకపు వికృతితో,
బ్రతుకు పచ్చమైదానా లాక్రమించు పైశాచిక నాట్యంతో.
హరితనీలమణులభాతి ప్రకాశించు పంటలపై, పైరులపై
భీతావహమై విడిసే—జీవితాన్ని జడిపించే—మిడుతలతో,
పరివృత్తసంకులమై విలంఘించు ఉప్పెనతో, ముప్పులతో
అసహాయత ప్రతిష్ఠించు విలయసమయభూకంపాలతో,
ప్రతిచరణాంగుళివి కరచి విషమురికించే కఠోర
[మరణంతో,
రుధిరంతో, పలలంతో, కరాళాట్టహాసంతో, వికార
[మారణముతో,
బధిరులు, భిక్షుకులూ, పంగ్వంధులుగాగల అగణిత
[బాధితులతో,
లేములతో, నాములతో, రోగాలూ—రొచ్చులతో,
[పుచ్చులతో,
చిచ్చులతో, ఉచ్చులతో, ముచ్చులతో, గచ్చపొదల
[మచ్చులతో,

బాములతో, పాములతో, జ్వరాలతో, క్షయాలతో,
[భయాలతో
సంతతమూ వినాశకరహేతువులకు శిరమిచ్చే
జగము విడిచి తమ దారిని పయనించే మానవులను;
వేదనతో బ్రతుకు బరువు మోయలేక మరణించే
అనాథులగు— నిర్ధనులగు— అసంతృప్తులగు నరులను;

అధికపాతకాల విచ్చుకత్తులు మూయించలేని
అల్పమైన వేతనాల— కేతకీ నికుంజ విభృత
కాలోరగ విఘాతాల విషాదాల నిషాలతో,
గడుపుతున్న మనుగడలతొ, కడగుతున్న యిడుమల
తడియారని సుడుల కడలి కెరటాలకు తలవంచే—
అనంతబాధాజీవనకుంభవృష్టి విడంభించి
విలంఘించ విలాపించు నిస్సహాయమానవులను

ఏదో ఒకమూలనింత జాగాలో కుటీరాన్ని నిర్మించుక
దినదిన గండాల్ వింపిన గంపెడు సంసారాలతొ,
పిచుకలవలె— చీమలవలె— బ్రతుకుతున్న మానవులను;
ఏదో గంజో కడుగో కడుపుకు కాస్తంత తాగి
కర్మసాక్షితో సమముగ దినమంతా పాటుపడుతు
ఇతరుల జోలీ శొంటీ ఎరుగకుండ ఇరులమధ్య
పరువు కొఱకు పడిచస్తూ పరుల కొఱకు కష్టిస్తూ
గువ్వలవలె— తేటులవలె— బ్రతుకుతున్న మానవులను;

అయ్యో, అయ్యయ్యో! బలిగొన్నావేలనె ఓ జలప్రళయ
[గోదావరి !
అబ్బా— ఈ నిష్కారణ మహాక్రోధ బడబానల మేలనె ఓ
[గోదావరి !

## విషాదతరంగం :

ముద్రణాలయమ్ములోనా, లోకోమోటివ్‌లోనో.
పొగాకు కంపెనిలోనో, సిల్వర్ ఫౌండ్రీలోనో.
రైల్వేవర్కుషాపులోనా, టెలిగ్రాఫెక్స్చేంజిలోనా,
పోస్టాఫీస్‌పనిలోనో, ఫర్నిచర్ షాపులోనా,
కూరలమార్కెట్‌లోనో, పుల్లల అడితీలలోనా,
రిక్షావాలాగానో. హోటల్ సర్వర్‌గానో,
తలదించుక వెళిపోయే వెర్రిగుమాస్తాగానో,
లాబుక్కులు నెమరేస్తూ బ్రతికే ప్లీడరుగానో,
పుస్తకాల సాక్ష్యంతో భావిలోకిప్రయాణించు
[యువజనులుగ,
బార్బరుగా, దోబీగా, స్కేవెంజర్-స్వీపర్లుగ,
జట్లు కార్మికులుగానో, కొట్టుల నౌఖర్లుగానో,
మరలోనో, చెరలోనో, తరువులుకోసే చోటనో,
పరిశ్రమకు దేహాలను సమర్పించి బ్రతుకుతూన్న
అసంఖ్యాక నిర్భాగ్యుల హతమార్చితి, నిరాశ్రయుల
నిరాధారపక్షులుగామార్చితి, దిక్కులేకవిలపించే-
[గావించితి,

నిరుపయోగులై తిరిగే—జీవన్మృతులను చేసితి
వెందులకే గోదావరి ?

దేవుఁడుగుడి బొరియలలో శాంతంగా బ్రతుకుతున్న
పావురాయి జంటలవలె అపకారపు అనుభవమే
ఎరుగకుండ నిరపాయంగా బ్రతికే మానవులను
దొంగచాటుగా ముంచితి వెందులకే గోదావరి ?

అర్ధరాత్రి సమయంలో అంతా పవళించిన తరి
గోడచీల్చి నెమ్మదిగా చొరబడ్డా వెందులకే గోదావరి ?
పసికందుల ప్రాణాలను బలిగొన్నా వెందులకే గోదావరి?
ఆశల వరచేతబట్టి పారిపోవుచున్నవారి
నసహాయుల, ఆర్తిజనుల, ఖేదతమోరింఖోళిని,
వెనుకనుంచి తరిమి తరిమి— కసితో గర్జించి మించి
పగబట్టిన పడగలతో విషము లుమిసి నిర్జించితి
వెందులకే గోదావరి ?

కాశ్మీరఖండాలు పండే కేదారా లనంతాల
కదళీకిమ్మీర చూత జంబీర సకలఫలవనాల
నీ కబంధబాహువులతో, బకాసురుని ఆకలితో
తృటిలోపల వినాశనమ్మొనరించితి, భూస్మేరము
తొలగించితి—వెందులకే ప్రళయకాల గోదావరి ?

విన్నటివరకూ మమ్మల చల్లని తన స్తన్యమిచ్చి
పాలముంచి తేల్చుతల్లి నేటికొక్క క్షణములోనె
సప్తజిహ్వ లురలిస్తూ విలయ జలములోన ముంచి
ప్రతిగుండెకు బీటలెన్నొ విరచించే పెనుభూత
మ్మగునవి తలపోయలేక, విపత్తు దర్శించలేక
నిర్భయముగ విదిరించే సమయంలో సమస్తాన్ని
మ్రింగేశావెందులకే గోదావరి—సమవర్తిని !?
ఆకలితొ గోండ్రించే ప్రసవించిన సివంగిలా
నిర్దయగా చంపేశావెందులకే గోదావరి?

## భావతరంగం :

దుష్టవిధుల కెరలించే గుప్పించే
నిప్పుల విట్టూర్పుల కెరయై రగులుతున్న,
పగులుతున్న బొగులుతున్న నిశామగ్న జీవితాల
శనిదేవత వక్త్రంవలె విచ్చుకున్న శనివారపు రాత్రిలోన
కాళరాత్రి పెంజీకటిలో కదలే పెనుభూతముగా
హద్దుమీరి ఉరకలిడుతు కైపెక్కిన రక్కసిగా
భూతలాన్ని మ్రింగినా వదేమి పాపమే ?
ఈపుడమితల్లి పసిబిడ్డల పాపమేమిటే ?
ఈన్యాయం ఎక్కడిదే మదోన్మత్తగౌతమీ ?

విచికలామోదముకై కలలనుకంటూ
రుచిరజీవ కాంతులతో తులుకగచూస్తూ

మనసులోని మమతలెన్నో మలచగచూస్తూ
కనులముందు కాంక్షలేవో విరియగచూస్తూ
పిచుకలమై గడపుతున్న బ్రతుకులపైనా
హటాత్తుగా బ్రహ్మాస్త్రం ప్రయోగించుటేనా ?

అవునుగాని, వేలకొలది వత్సరాల నీ జీవనపూతచరిత
ఒక్కసారి కళంకితం చేసుకొంటి వెందులకే గోదావరితల్లీ !
ఎచటెచటో పెనుజడులై కురిసిన పాపాలకు — నిర్దోషుల
అమాయకుల నీసందిట పవళించిన పమ్ములనా శిక్షించుట !
వాసిష్టవైనతేయ గౌతమాదులైన మహామునుల జీవితాల
అలనాడే పునీతమొనరించినావుకాదా — ఓగోదావరితల్లీ !
అట్టి నీకు తగునటే — ఆరణ్యక వృకన్యాయమమ్మా !
అతిభీకర పంచానన విషదంష్ట్రానల కీల లుమిసి
హేమృత్యూ ! మానవమేధస్సముపార్జిత మీసర్వస్వం
దోచుకొంటివిప్పీ — ఓసిగ్గులేని నంగనాచి !
దొంగతనం నీకేలనె ప్రళయకాల గోదావరి ?

## ఐతిహాసిక తరంగం :

ఏడునాల్కల బ్రహ్మరాక్షసీ గోదా
ఏడ్పులోనే మమ్ముముంచుటిది వాదా
వందలాదికవులు వర్ణించలేదా
చల్లనీతల్లివని నుతియించలేదా

ఇది ఏమిన్యాయమే ఓతల్లిగోదా
నీకీర్తి పన్నీరు లవణాబ్ధిపాలా
ఏడు పాయలు ఏడు వైతరణీనదులా
ఏడు నాల్కల బ్రహ్మరాక్షసీ గోదా

కరుణాతి కరుణతో కాపాడలేదా
చరణాంగుళులు సోకి సిరులీయలేదా
కేళీగృహమ్ములో క్రీడించు వేళా—
భార్యభర్తల బంధ మెడబాపనేలా
ఈ రాకసత్వాలు సాగించ తగునా
ఇట్టి భీతావహము సృష్టించనగునా
ఏడ్పులోనే మమ్ము ముంచితిదివాదా
ఏడు నాల్కల బ్రహ్మరాక్షసీ గోదా !

సకలజన సౌభాగ్య దాతవన్నారే
పరిపూర్ణ సమభావ త్రాతవన్నారే
కామితాలీడేర్చు కామధేనువుగా—
పాడిపంటలనిచ్చు గోస్తనీనదిగా—
యుగయుగాలకు విలువ లొనగూర్చలేదా
జగజగాలను ఖ్యాతి-నార్జించలేదా
ప్రణయరస రాజ్యాల సౌందర్యడోలా
రమణీయ స్నిగ్ధతమకావ్యాలమాలా.

చపలచిత్తము నీది వ్యాళోగ్రజ్వాలా
కుపితారుణోజ్వలిత నేత్రాలవేలా?
కృపతోడ బ్రోతువని కీర్తించలేదా
నిశిత కృపాణాలనెత్త మరియాదా?
ఇరులు ముసిరిన విలయ సమయమ్ములోనా
మదపిచ్చికొన్న కరి కరణి యగుచేనా
రకరకాల్ మకరులను బోషించు కతనా
కౄర క్రకచత్వాలు సిద్ధించుచేనా!

అలనాడు పంచవటి పర్ణాలనీడా
జానకీరాఘవుల నిలుపుకొన్నావే?
వృద్ధమాతా శబరి కొరికిచ్చుపండ్లూ
శ్రద్ధతో శ్రీరాముడారగించంగా
ఆ యుదంతము నీవు కనులార చూచీ
విరగబడి పరవళ్లుతొక్కి నవ్వితివా?
బౌద్ధధర్మజ్యోతి ప్రభవించినపుడే
నీపయఃపూరాలు పూతమవలేదే?
రాజరాజనరేంద్రు సింహాసనముకై
జ్ఞాతిసామంతాది అవరోధములనూ
అరికట్టి భద్రముగ రక్షించలేదా
సర్వజనసౌఖ్యాల నొనరించిగోదా!

రెడ్డిరాట్ ప్రభువులను నీదివ్యతోయాల్
జల్లి ఆశీస్సులను కురిపించలేదే ?
వడ్డిరాజుల క్రూరకర్మలకురోసీ
ఉగ్రకంఠమ్మెత్తి శపియించలేదే !
రాయలేలిననాటి రాజ్యానికీవే
కళ్యాణగీతాల నాలపించావే;
భవదీయ పరిమళానంద జీవనమే
చరితార్థమవకుండ వమ్ముజేసితివే !

ఓరుగంటికి రాణ్మహేంద్రముకు నడుమా
యావదాంధ్రను కొల్లగొట్టుచూబ్రతికే
ముసల్మానులకీడు నీడలబడుంగా
మహామారి తుగ్లక్కు భూదాహమమరా
హుమయూను గజ్జరను పాలకుని ఆనా
నీవరినిగల పవిత్రాలయము కొట్టీ
బ్రహ్మాండమైన మజ్సీదు నిర్మించా
అది వారి ఘోరకృత్యాల చిహ్నంగా
చిరస్మారకమ్ముగా గొంతెత్తలేదే !
ఆనాటి మావంశజనుల దుఃఖాల
చూచి నీరైపోవ నేగుండె గోదా ?
కపితోడ దుష్టుల శపించావుకాదా !

తెల్లదొర లింగ్లీషు ముళ్ళపొదలల్లా
నిలువెల్లక్రుంగి కృశియించావుతల్లీ!
నీతీరభూమిలో కోటిలింగాలూ
మూఢవిశ్వాసాల శాపాలు దొరలీ
గాఢనిద్రామగ్నమైపోవతల్లీ
నీమంత్రజల శీతశీకరాల్ జల్లీ
జాగృతీ పవనా లుషోగీతి బరపీ
ఒక మహావీరేశలింగాన్ని లేపి
తెలుగు నేలల చెముడుడొంకలను దులిపి
నవయుగోదయ శుభశ్రీల నెలకొల్పి
నవభవనముకు మూలబంధాలు నిలిపి
నవ్యాంధ్ర హృదయాల పెంచావుతల్లీ!
'శ్రీలుపొంగిన జీవగడ్డ'వే తల్లీ
'పాలుబారిన భాగ్య'సరితవే తల్లీ
వందలాదికవులు వర్ణించినారే
చందవపు గుమ్మవని కీర్తించినారే
నీసప్తజిహ్వలూ వైతరణినదులా
నీసమున్నత సైకతాల్ యమునిభటులా
ఏడ్పులోనే మమ్మ్ముంచుటిది వాదా?
ఏడునాల్కల బ్రహ్మరాక్షసీ గోదా!

## శాపతరంగం:

ఆక్రందిత మానవహృదయోన్మీలిత
బాధాగాధలగాధం కాదా ?
ఆలోకిత మానవ హృదయసముద్రం
అహరహమూ మథించబడటం లేదా ?
దినదినగండాలెన్నో గెడ్డపు బూచాళ్ళవుతూ
పసిబ్రతుకుల ప్రతిరాత్రి భయపెట్టుటలేదా ?
దేవలోకమున విరిసే పారిజాత కుసుమాలను
భావనలో మనమంతా ఆఘ్రాణిస్తుండలేద ?
రామపాదసాగరాన్ని నిర్మించే కాంక్షలతో
అనునిత్యం మనమంతా రేపులగుణియించలేద ?
భద్రాచల శ్రీరాముడె శేషశాయి కవతారము—
మనజాతికి ధనలక్ష్మిని ప్రసాదించరాదా ?
అదియె శమంతకమణియై బళ్ళకొద్ది కాంచనాల
ప్రతీక్షణం ప్రవహించునట కాదా ?

అ౦చాతనె పదిహేనో ఆగష్టున
ప్రవేశించు అరవస్వాతంత్రదినం
మనబాధల ముగించునని గుండెనిండ ఆశలుండ
కట్టినాము మంగళకర నవపల్లవ తోరణాలు !
వీధులన్ని సందులన్ని ఇళ్ళన్నీ శుభ్రపరచి
రంగవల్లికలమర్చి, అంతరంగ రంగములో

శారదనభమై వెలిగే జీవితశోభలవెన్నో
ఈపండుగ యిస్తుందని....
దండుగ తీరుస్తుందని....
దండిగ మేల్ చేస్తుందని....
కరువు బరువు తరిగిపోయి, అకాల జరరుజలు వీగి
అభయసుఖం సమృద్ధిగా వెల్లివిరిసి
ప్రీతియెదలో ఆనందాల్ విరిసి గుబాళించుననుచు,
ఆశల పాయసాల్ మెసవి హాయిగ విదిగ్రించినతరి
దుస్స్వప్నం మాడ్కి నెగసి
దుర్విధి శాపాలుకురిసి
ఉవ్వెత్తుగ ఉప్పొంగితివేలనె గోదావరీ !
స్థిరచరాస్తు లన్నిటిపై,
స్థావరజంగమాలన్ని
ఒక్కసారి ముంచెత్తేవేలనె గోదావరీ !

అక్టోబరు ఒకటినాడు
అవతరించనున్న ఆంధ్రమహాజనత
చిరవాంఛిత తపఃఫలపు
శుభోదయ స్వాగత వేళోద్భాసిత మంగళగీతిక—
ఇదియా నీవినిపించే వాందీఘనతర చరణము ?
గతకాలపు శుభశోభాసముత్పన్న
యుగ యుగాంతరమ్ములోవ

ఎన్నిసార్లు ఆనందం తరంగించలేదె తల్లి ?
విగతజీవులైన పితృపాదుల మనసెన్నిసార్లు
ముముక్షాభిముఖమ్ముగా నీతో పయనించలేదు ?
సులివెచ్చని బ్రతుకంతా భయదశీతలమ్మవుతూ
రేపుల జలతారు కొత్తమెరుగుల నాశించమాని
రిత్తగ ఉన్మత్తవికారాట్టహాస ప్రభంజనాల్
నైదోడై....
తమ వలపే సుడిగాలై సుళ్లుతిరిగి—
తమతలపోక పెనుతుఫాను గర్జనలై—రేగుచుండ,
బ్రతుకు నింగిలో రిక్కలు
ఒక్కసారి రాలిపోయి,
గతులన్నీ తలక్రిందయి,
రేపులేని చీకటిలో—
సర్వలోక సమాశ్లేష బడబాగ్నికి
కడపటి కోరికలన్నీ కాళరాత్రిలోనె వ్రేల్చి
ఆశాసుమమాలోత్సవ మనుజుల కొరకై త్యజించి
నీకడుపున కలిశారే అసంఖ్యాక సుమహృదయులు;
నిర్దయగా నమలి మ్రింగితేలనె ఓ రాకాసీ—
బ్రహ్మ ప్రళయగోదావరి !

ఎచట కూనవరం చూడు,
ఎక్కడ కోరంగి కలదు ?

ఇంతమేర నింపావే—ప్రళయసాగరోదకాలు !
ఎక్కడ భద్రాచలమే,
భవశేశ్వర మెచ్చటనే ?
ఈయనంత ప్రదేశమ్ము
హావ్వా ! నీ బొజ్జుపొక్క !
జలమయ నిర్జీవనమై హాహారవాల నింపితి
వేలనె ఓరాకాసీ గోదావరీ !

నిన్నగాక మొన్ననె నన్నెంతో సమ్మానించిన
పురాచరిత పరిమళాలు వెదజల్లే
కూరిమిగల కపిలేశ్వర పురవరమ్ము
గుండెపగుల రోదిస్తున్నాదమ్మా :
తల్లీ పిల్లా ఎరుగక,
ఆలుమగల ధ్యాసలేక,
కుటుంబ జీవనమంతా చెల్లాచెదరై పారగ,
ఎడద లదర పడిలేస్తూ
నలుదిశలకు పరుగులెత్తి
యముమహాశాక్రంద ఘోష
ఎవరికి వా రేకాంతపు లోచెవిలో నాలకించి,
తడబడుతూ, వడివడిగా
ప్రాణాలరచేతబట్టి
రక్షణకై వెతకులాడి,

గతములోని బ్రతుకు వెలుగు లాక్షణాన విస్మరించి,
గతాగత జ్ఞానమంత శూన్యంగా మరపించిన
దేవోనిర్లిప్తతతో—
దిక్కూ— మొక్కూ— ఎరుగని
భయభ్రాంత హృదయాలతో
నిరాశ్రయుల నిర్భాగ్యుల—నిర్వాసుల నిర్జీవుల,
సమూహమై....
ఆశాలవలేశమేమి లేకుండా
చేసితివే ! ఉవ్వెత్తుగ కాలరాసి,
ప్రళయోద్భవ గోదావరి వారివాహ !
మరణంతో ముంచినరుల
గుండెలెన్నొ మాలగుచ్చి
తోరణాలు కట్టుకొంటివిప్పో ఓపైశాచిక గోదావరి !

తల్లి తెలంగాణలోన నీసోదరి
మంజీరామృత వాహిని పొంగిపొర్లి
నీయెదలో లీనమగుట విపత్తుకా?

గలగల చిరుమువ్వలెన్నొ మ్రోగిస్తూ
తెలుగుగుండె పాదివి రసోల్బణమ్మొనరిస్తూ
నిగనిగలతొ కదలిపోవు వాగుల కిన్నెరసానికి
ఆశ్రియ మివ్వావుకాదె ?

తదౌదార్య మిందులకా,
మా బ్రితుకుల కాపదకా,
పెనురొదలను ముంచుటకా ???

ప్రాణ హితాపతల్లికా స్రోతస్విని
నీ ఎదలో విశ్రమించి
నీ పయ్యెద కుచ్చెళ్లను
సుమశీతల ఛాయలలో ఆశ్రయించి,
హృన్మరంద మధురసాల నిష్యందిత శీలవగుచు
ప్రాణిహితానందవృత్తి ప్రవర్ధితామోదకీర్తి
దశదిశాంతరాల మధ్య సర్వత్రా పాడుకొల్పి
ప్రవహించుట యిందులకా ?
మాగుండెలు ప్రిదులుటకా ?
ఉత్తుంగ సంఘముకా ? జీవన సంఘాతముకా ?
మీ యిరువురి సంగాతము; అయ్యారే గోదావరి !

సురనాథుని చాపమువలె—
సప్తవర్ణ దీధితితో భూహృదయం పెళ్ళగించి,
ప్రకాశించు అమృత శైవలినీ యింద్రావతి—
నీ దయార్ద్ర హృదయములో
దాతృత్వము నాశిస్తూ
సవితాతప తప్తభీతి కనుక్షణము

దద్దరిల్లి కంపిస్తూ బ్రతుకలేక
ఏయగణిత హస్తాలను
శరణుకోచ్చు టిందులకా ?
మానవత్వ నాశముకా ?
దానవత్వ హాసముకా ? హాలాహల ప్రసరముకా ?

దోర్దండ మండితా ఖండలమైత్రిన నీ
కీర్తి బెండుగమారుచున గోదావరీ!

ఓ శబరీ!
అనాగరిక మసంస్కారచేతస్కత కధికారము నీదికదా?
దిసి మొలతో సహజాకృతి ప్రస్ఫుటించ,
అడపాతడపా తనువున
శీతవాతముల బాపగ ఆకులు తోళ్లూ కప్పుక
ఆటవిక ప్రవృత్తితో నిషాదినివై బ్రతుకుతూన్న
నీకెక్కడి దోసీ? ఈకృపా పూరరస హృదయము!
యాదృచ్ఛికముగ నెదో—
మనసులోని మసగ మసగ నీడరీతి
మసలుకొన్న భావముతో—
గంపెడు కాయలు పండ్లూ
నెత్తికెత్తుకొని పోతివి;
విధి ప్రేరితులై వెడలిన, నాడరణ్యవాసులైన

సీతారాముల సన్నిధి
సహాయనము లర్పిస్తివి,
పచిచూసే మిషతో నీ
ముని పంటను కోరికి పండ్లు;
అత దయాయకుడు కాదే,
నీచర్యలు మూఢభక్తిగా ఎడదను విశ్వసించి
నీకు శాశ్వతత్వ సిద్ధి
కల్పించుట వెర్రికాదె ? అపాత్ర దానమ్మోకాదె ??
పిదప కాలమంత నీవు
దఫ దఫాలుగా ఘోరాలెన్నిసార్లు జరిపితివే ?

ఓ శబరీ ! నీ కబరీభరములోన తురుముకొన్న
వెన్నెన్నె పుల్లకుసుమ పాదపాలు !
నరనిర్మితఘన సదనాల్ !
ప్రాణికోటి రోదనాలు !
గహనాంతర జీవములకు సహవాసివి కాదే ?
రుధిర పిపాసితమూర్తీ !
శిథిల విహ్వలిత గాత్రీ !
ఇట్టి దుశ్చరితలున్న రాతిగుండె బోయదాన !
నీ బ్రతుకున కెట్టులనే—
సుమవల్లీ గోదావరి పొందుదొరికె ?
నీతోగల సాంగత్యము

బుద్ధిని పెడదారుల త్రిప్పి—
దోషాల్ చేయింపకుండుటెట్లు పొసగునే శబరీ !
ఓ శబరాలయ సంచారీ !
రాటుక కొండలరీతిగ రాసులైన నీపాపా లమేయాలు
గుట్టలుగా పెరిగి పెరిగి పాపికొండ లమరె నచట !

నీ యనుజాల బలోపేత
గర్వాంధమ్మతిశయించి నతిభ్రమించి
పూనితివే ప్రళయకాల తాండవ కోలాహలముకు !
ఉచ్చ నీచములు వలదా ?—
ఈ చేష్టకు పాపిష్టి, విష్రహోదిని !
ఇంతఘోర దుర్మార్గా లేలనె ? ఓకుటిల కుంతలాపగా !
అఖిల జీవవిధ్వంసీ ! ఓహో—ఓ.... గోదావరి !!

## కావ్యతరంగం :

సాయంసంధ్యారుణ మహాకాంతి వెల్లువ లస్తాద్రిని
చలువల నభోవీధి క్రుమ్మరించు శుభోపేత సమయంలో
సుస్మేరపు సుగంధాల పచరించే సమయంలో....
నీ యొడిలో విశ్రమించి కమ్మనిలాలన గీతుల నాలిస్తూ
నీ తటాన ఆశీనుండై నాడడిగో, రాజమహేంద్రమున
కవిభట్టారక మహాయతీంద్రుడు, నన్నయభట్టారకుండు,
ఆంధ్రశ్రీకారము లిఖిస్తున్నవాడదె మహానీయుడు

విభూతి పుండ్రాల్ నెన్నొసటను సూర్యరేఖలై తేజరిల్ల
కవితావిర్భూతిని— మౌనమగ్న తపస్సమాధిగ
మార్చుకొన్న ఆదిభావుకుం డిడిగో, మా మార్గదర్శి!
హృదయంలో కళపెళ భావతరంగా లుప్పతిల్ల
మహాభారతామ్నాయము మా జాతికి ప్రసాదించలేదా?
ఓ తల్లీ! ఆ సుకృతాల్ నీవేకావా గోదావరి వారివాహ!

మహా శేముషీమనీషి, సకల కలానదాధుండు
కవితారసరాజ్య విభవ సింహాసన చక్రవర్తి– శ్రీనాథుడు
నీ యమృత జలసేచనమంది కాదె పురాణేతిహాసంగా
భీమేశ్వర మహాకృతిని విరచించెను ప్రజ్ఞానిధి :

నీ హృదయాంతర సలిల తుషార కలితధౌత కలధౌత శలాకా
శకల దర్పణాల్ కనుగొని కాదే– విజ్ఞానఖనీ మహాప్రభువు
కుమారగిరి, ప్రతి వత్సర వసంతోత్స వాహ్లాదం జరిపించెను;
లకుమాసుందరీదేవి చారు చరణ నాట్యోత్సవ చారణమున
కళాకౌశలమ్ము లెరిగి విభ్రాజిత మనస్కుడై వసంత రాజీయ
నాట్యశాస్త్ర దర్పణము రచించె ?
నీ పవిత్ర తోయములో
ఏమహత్తు కలదో కాని, ఎందరు రసికావతంసు
లెందరు విజ్ఞానధను లికెందరు కమనీయకవులు—
మజ్జననీ, గోదావరి మధులహరీ! మెరపించితి వెన్నిసార్లు
మామక స్వాంతముకూడా!

తుల్యభాగానదీ కళ్యాణ తటముపై
చూతాటవీవాటి శోభించు మధుపాళి
వెన్ని తల్లీ! కావ్యఝుంకారములు నింపె ?
దక్షవాటీ మహా స్థానకర్ణికలోన
పూషాద్యులచే ప్రతిష్ఠింపబడినాడంట
విశ్వపతి భీమనాధేశ్వరుం డలనాడు !
ఆంధ్ర భూ భువన మధ్యము పుండరీకమ్మ
సప్త గోదావరీ జలము — తేనెల గ్రోలి
మత్తిల్లినాడు నీ ప్రియసుతుడు భీమకవి !
ఎందరెందరు తల్లి! యతులు ప్రతి యుగములో !!

నదియొడ్డున పొత్తిళ్లను విశ్రమించి వాసించిన—
నీ తరగల తేలియాడు పవనగంధ వహము లోలయ—
క్రొమ్మెరుంగు వెలుగులీను లలికెరటా లెలుగులెత్తి
నీ వాలాపించినట్టి అమరకావ్యముల వింటూ,
ఆనందోన్మత్తహృదయ రాజీవము లెన్నిగలవు?
మానవ మానస సరోవరాన మసలు హంసలెన్ని ?—
అసంఖ్యాకులమ్మా — నువు కని పెంచిన కవీశ్వరులు—
ఓహోహో రసధునీ, రత్నఖనీ గోదావరి జననీ :

నీ చనుబాలతో నెదిగిన కవీశ్వరుడు,
కమనీయ పాండితీ ప్రాభవోపేతుడై

కవితా జగన్నాథుడైనాడు, ఆనాడు;
అఖిలభారత జ్ఞానధనము తనదన్నాడు !
కవితా రసోపేత గంగను ధరించాడు—
భారతీయుల మనోసామ్రాజ్య వైభవాల్
ప్రభువుగా కలకాల మేలుకొన్నాడతడు—
వైజాత్య రూపసి లవంగి హృదయము కూడ !

భద్రగిరి ఉన్నతోన్నత శిఖరి నివసించి
నీ చిరుత గలగలల క్రొమ్మెరుగు తళతళల
నర్తించు అలలు ప్రతి నిముసమును తిలకించి
హసితాననుండైన శ్రీరామచంద్రులను
నెలకొల్పుకున్నాడు తన చరిత చిహ్నముగ—
చింతాకు పతకమును సీతమ్మకిచ్చాడు—
ఆ నేరములకొరకు చెరలోన కుందాడు,
నీ కుమారుడు కాడె కంచర్ల గోపన్న—
శ్రీ రామదాసుగా— జనహృదయ కవివరుగ !
నైజాము గద్దెపై కొలువున్న తానీష,
అల హిరణ్యాక్ష నిర్మిత దీర్ఘ తమసముల
ఛేదించలేదె తన కావ్యకాంతుల బరపి.

అట్టి నీ తపమంత వొట్టిపోయెనో ఏమొ?
కటకటా గౌతమీ మృత్యుకంకణ రవళి

ప్రతి హృదయకుహరాన విహరింపజేశావు;
సస్యశ్యామలమైన సిరిసంపదల నేల
ప్రళయాట్టహాసోగ్ర భయద జీమూతాల
భైరవీ నాట్యాల సీమగా మారగా,
వికృతాకారాల శాకినీ ఢాకినీ
పైశాచిక సమూహ వాహ్యాళి కనువుగా
భూతాల ప్రేతాల మృత్యుదంష్ట్రాగ్నిగా
కటకటా! గౌతమి తృటిలోన మార్చావు!
మా సర్వలోక సముపార్జితాగారాల
ధనకనక వస్తువాహన సముచయశ్రీల
ఒకనాటి ఉన్మత్త ఘడియలకు నెరజేసి
అండమాన్ ద్వీపాల ఊసరక్షేత్రాల
కెందుకే కొనిపోయి బంది చేస్తున్నావు?
స్వపరభేదములేని వైరాగ్యమేలనే?
కపటనాటక సూత్రధారి గోదావరీ!

## శోకతరంగం:

చిగురుటాకువంటి బ్రతుకు తల్లీ — ఓ తల్లీ
వగపులోన ముంచినావు ,,
వాడవాడ లన్ని తిరిగి ,,
కీడులెన్నో పంచినావు ,,
క్షణక్షణము క్రొత్తమొలక ,,

అణువణువూ తొడుగుతోంది    తల్లీ — ఓ తల్లీ
ప్రళయకాల జలధివైతి    ,,
జలప్రళయ నాట్యంతో    ,,

జనుల బ్రతుకు లెన్నెన్నో    ,,
కనుల ఎదుట కరగిపోయె    ,,
భర్తభుజము తలాడగా    ,,
పవళించిన వనితలనూ    ,,
తల్లిచన్ను గుడుచు నిసుగు    ,,
మూడుకాళ్ల ముసలివగ్గు    ,,
నడుమువంగి నడువలేక    ,,
కాటిదెసకు కాళ్ళుజాపి    ,,
వేచియున్న శతవృద్ధులు    ,,

సమూలముగ పెళ్లగిలిన    ,,
చెట్టుగూటి కాకిగుడ్లు    ,,
ఆరు రోజులై పుట్టైను    ,,
కన్నితాకు బంధించిన    ,,
కోడెదూడ కెవరుదిక్కు    ,,
తెల్లకోడి పిల్లలవే    ,,
తల్లితోడ తల్లడిల్లె    ,,
వచ్చని ఈ బ్రతుకంతా    ,,
మచ్చలేక మాసిపోయె    ,,

కలిమిలేమి పెద్దచిన్న తల్లీ — ఓ తల్లీ
భేదమేమి చూపవేమి ,,
అర్ధరాత్రి చీకటిలో ,,
దిక్కు తెన్ను తోపకుండ ,,
తడుముకొనే ప్రతివారిని ,,
పీకనులిమి చంపినావు ,,
తీపి కలల జీవితాలు ,,
ముంచినావు విపత్తులో ,,
క్షణంలోనె వినాశమా ,,

ఏమినేరమే జనులది ,,
ప్రతీయేడు పసుపు కుంకుమిస్తున్నారే—
బ్రిడ్జిమీది రైలునుంచి డబ్బులిత్తురే—
నీకొరకై పుష్పాంజలి ఘటియిస్తారే—
ఇలవేల్పుగ నిన్ను పూజ చేస్తున్నారే—
కడుపు చలువ కన్నతల్లి వనుకుంటారే—
మునివాకిలి దివ్వెపెట్టి నిను స్మరింతురే—
నీపేరును ఇంటింటా నెల కొల్పుదురే—
ఇంతటికీ ప్రతిఫలమా తల్లీ — ఓ తల్లీ
వంతల సుడిగుండమేన ,,

కొంపకూల్చినావుసరే ,,

కొడుకుల బలిగొన్నావే తల్లీ — ఓ తల్లీ
ఆస్తి దోచినావు సరే ,,
గొడ్డుగోడ మ్రింగితివేం ,,
పుస్తె పూసలమ్ముకొనుచు ,,
జీవించే జీద బిక్కు ,,
ఇసుమంతయు జాలిలేదె ,,
జీవరసము లేమాయెను ,,

ఆకుపచ్చ ఆశలన్ని ,,
చీకు చింతలై పోయెనె ,,
సిరొమ్ముల చేపులిచ్చు పాయలవన్ని
నదీ మాతృకమ్మలైన పంటపలతితో .
ఆరామక్షేత్రలమై తల్లీ — ఓ తల్లీ
కమ్మని కుందనములేను ,,
తాళవృంతమై వీచెడు సీతరగలు తల్లీ
తాళవృక్షమెత్తు పొంగెనేల నేడు తల్లీ
విపులమైన పుడమితల్లి విలపించినదే
రిపులుకూడ ఈకీడుకు కరుణ చూపిరే
ఆకుపచ్చ ఆశలన్ని తల్లీ — ఓ తల్లీ
చీకుచింతలై పోయెను ,,

## క్రుంగు :

ఎంతని వ్రాసెదనమ్మా నీ నిర్మిత భీభత్సం
వంతలు వేలూలక్షలు నీ వరదల పెనుఫలితం

చల్లని మా భూతలమే నీరవస్మశానమాయె
ప్రళయకాల కృతోన్మాద జలమే నీరంధ్రమాయె
ఈ యనంత దుఃఖానికి ఎక్కడిదే అడ్డుకట్టు ?
ఈ యనంత పరివేదన కెక్కడున్న దాటకట్టు ?

ఒక్కమాట చెబుతా నీ వాగి వినుము తల్లీ !
నీ వాసగిన నాగరికత నశించింది తల్లీ !
నీ వాహిని కల్పించిన జనపదాలికేవి తల్లి ?
నీ పాయలు సృష్టించిన సంపదలేమాయె తల్లి ?

నీ విచ్చిన విజ్ఞానం తృటిలో మాసెను తల్లీ !
గుండెలవిసి రోదించే మేమేవిధి నిర్మింతుము మళ్లీ ?
అమ్మా నీసంతతి కింకెక్కడుంది బ్రతుకుదారి ?
అయ్యయ్యో, ఈ విఘాతమేలనె గోదావరీ ?

[సమాప్తం.]

28—8—1953.